ఉ. రూపవిలాసవైభవని♦రూఢిన కాదసమాస్త్రికౌశలుం
డాపృథివీశుఁ డొండొకక్రి♦యం బరికించిన మన్మథుండ యు
ద్దీపితకాంక్షుఁ దద్ఘనుఁడు ♦ ధీరవిహారముచేత శాత్రవ
క్ష్మాపతులన్ నిలింపపుర♦కాంతల నొండొరుతోడఁ గూర్చుటన్. 2

ఉ. ధీరుఁడు శూరుఁ డక్షయవి♦తీర్ణవిహారుఁడు బంధులోకమం
దారుఁడు నీతిమార్గసము♦దారుఁడు లోకపవిత్రకీర్తివి
స్తారుఁడు దోషదూరుఁడు ని♦తాంతగభీరుఁడు నిత్యశోభనా
కారుఁడు ధర్మసారుఁ డవి♦కారుఁడు తజ్జనపాలుఁ డెయ్యెడన్. [షణుండు

తే. అతనిగుణము లెన్నఁగఁ జతు♦రాస్యుఁ డైన,నచతురాస్యుఁ డగ్గధిషణుండు ♦ నధి
ధర నహీనుండు హీనుండు ♦ దక్షముఖులు, దక్షముఖులను మఱివేఱ ♦ తడవ [నేల.

ఉ. పూర్ణసమస్తసద్గుణవి♦భూషితుఁ డై పొలుపొందునాకళా
పూర్ణుకథల్ వినం జదువఁ ♦ బొల్పుగ సంతతివైభవాదివి
స్తీర్ణశుభంబు కల్మి కజు♦దీవన మున్నది గల్గెఁ గాన నా
నిర్ణయమార్యు లెల్ల మది ♦ నిల్పి వినుండు పఠింపుఁ డింపుతోన్. 261

ఉ. భవ్యత నెల్లదేశములఁ ♦ బ్రస్తుతి కెక్కుచు మీఱి యిమ్మహా
కావ్యము సుప్రసిద్ధ మగుఁ ♦ గావుత నిత్యము సర్వలోకసం
స్తవ్యనిజస్మృతిన్ వెలయు♦తాండవకృష్ణుకృపన్ బవిత్రశా
స్త్రవ్యసనాతిధన్య మగు♦సజ్జనకోటియనుగ్రహంబునన్. 262

శా. శ్రీరోచిష్ణుకటాక్షవీక్షజయల♦క్ష్మీసంతతాశేషయో
గ్యారాజద్భుజ యారువీటిపురభు♦క్క్షోణిపాలాన్వయ
క్షీరాంభోనిధికౌస్తుభాయితమహా♦స్థేమోదయప్రస్ఫుర
న్నారత్నావరపాత్రగోత్రతిలకా ♦ నంద్యాలకృష్ణాధిపా.

క. శోభితవైభవరూపమ, నోభవ కొండాంబికాత♦నూభవ భూతి
శ్రీభవ పరిశమితారి, ప్రాభవ బుధవర్ణ్యమాన ♦ రామసమానా. [త్రా

వనమయూరము. శైలవరధీరనిజ♦సంగరపరిత్రా, ణాలఘువిచారసక♦లాంగనుతగో
పాలనవిహార యవి♦భంగజయయాత్రా, శీల నగధీర నర♦సింగవిభుపుత్త్రా. 265

గద్యము. ఇది నిఖిలసూరిలోకాంగీకారతరంగితకవిత్వవైభవపింగళియమరనార్య
తనూభవసౌజన్యజేయసూరయనామధేయప్రణీతం బయిన కళాపూర్ణోదయం
బనుమహాకావ్యంబునందుఁ బ్రబంధపరిపూర్తిశోభనం బైనయష్టమాశ్వాసము
సర్వంబును సమాప్తము.

శ్రీ కామేశ్వర్యర్పణమస్తు.